


Reg. No. M. 2580




జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు.

సంపుటము ౨ } శనివారము ౧౫-౧౦-౩౨ నెల్లూరు } సంచిక ౬

## అధ్యక్షోపన్యాసము.

---

సభాధ్యక్షత వహించిన విద్వాంసులగు శ్రీ పంచాగ్నుల వెంకటేశ్వరశర్మగారి ఉపన్యాసమునందు ఈ క్రింది భాగములు ముద్రితములు:—

రయితు సోదరులారా!

సేతుశీతాచలపర్యంతము వ్యాపించిన మనహిందూదేశము సర్వదా వ్యవసాయము పై నాధారపడి యున్నది. పాశ్చాత్య దేశములవలె మనదేశము చేతిపనులపై యాధారపడియుండు నదికాదు. మనదేశమున నూటికి తొంబదిమంది వ్యవసాయమే జీవనాధారముగా గలవారు. మరియును నూటికి తొంబదిమంది పల్లెటూళ్ళ వాసులు ఈ పల్లెలయందుండు సమస్త జాతులవారును వారువారు ప్రత్యేకముగనో పరోక్షముగనో తమజీవనము కొరకు రయితులపై నాధారపడియుండు దేశమునందలి ప్రజలును దుస్థితికి లోను గావలసి యుండును. కావున దేశక్షేమముకొరకు ముందుగా రయితుక్షేమమునకు విచారింపవలసి యుండును. రయితుక్షేమమే పాలకుల క్షేమము. అట్టి విచక్షణ జమీనులందు అరుదు. మనవెంకటగిరి జమీనునందు బొత్తుగా లేనేలేదు. మన జమీందారుల అభిప్రాయము జమీనంతయు తమస్వంత హక్కనియు అందు యేభాగముగాని నాదియని చెప్పుకొనుటకు యే రయితునకును హక్కు లేదనియు కూలిభాగమును రయితు తీసుకొని మిగత దంతయు తమకునిచ్చిన బాగుండుననియు జమీందార్ల పాలసీయైయున్నది. యిది యెంతవరకు న్యాయమో చెప్పనవసరము లేదు. మొదట ప్రపంచమున రాజులేరీతిగా యేర్పడినది విచారించి చూచిన ఈ విషయము బాగుగా గోచరించును. జమీనులందు రయితులనుభవించు కష్టములు వివరించి చెప్పుటకు అలవిగాదు.

రయితు విక్రయించదగిన ధాన్యములు తోటలవల్లను, మెరక పొలములవల్లను, పల్లపు భూములవల్లను, ఫిబ్రవరి, మార్చి, ఏప్రెల్, మే నెలలయందు లభించుచున్నవి. గాన ప్రస్తుత కిస్తీకాలమునకు శిస్తు చెల్లించుటకు రయితు అత్యధికమైనవడ్డీ రేట్లతోను అత్యంత కష్టతరములైన ధాన్యపు జట్టీలతోను రొక్కమును సంపాదింప వలసియున్న కారణముచే రయితు మిగుల నష్టముల పాలగుచున్నాడు. అక్రమమగు కిస్తీకాలమును మార్పించి ఆయామండల గవర్నమెంటు కిస్తీ కాలనిర్ణయ ప్రకారము ఏర్పరచిన రయితుకు సులభముగా నుండును.

విభాగాలవలన నేర్పడి తేనేమి, విక్రయాలవల నేర్పడి తేనేమి అనేక సంవత్స

చాలుగా జాయింటు పట్టాల యిబ్బంది మిక్కుటముగా యున్నది. జాయింటు పట్టాలచే రయితులకు సంభవించుచున్న యిబ్బందులు వర్ణనాతీతము. మాగాణి భూములకు చెర్వునీరు నష్టంబు చేయుచున్నను రెండవ వారు శిస్తు కట్టుచున్నారు. ఇది చాలా అక్రమము.

యింతేకాక అన్యాయము దక్షిణాది తాలూకాలయందలి మైర్ల వారి శిస్తుల పద్ధతి. మలుము రేట్లు అన్యాయమైనవని తెలంపబడుచుండినను భావి ఫలపడి పోయినను అట్టి రేట్లను తొలగించక పోవుట కడు ఘోరము. మరియును స్వంత భావి ఆధారమున మెట్టతోటలలో చెట్టు ఆకుతోట మొదలగు మైర్లను మైర్లవారి శిస్తు దొరతనములోగాని ఏచోటగాని లేని గొప్ప రేట్లను విధించుట మిగుల అన్యాయము. శిస్తుల పద్ధతి యింత అధ్వాన్నముగా యుండడమేగాక సర్కారు గ్రామాదులకుగల సౌకర్యములు ఇచట లేనేలేవు.

ఈ సందర్భముల నన్నిటిని విచారించుకోవలసిన భారము మీయందున్నది. మనము స్థానిక సంస్థలకుగాని, శాసనసభలకుగాని జమీందారులగాని, వారి పక్షము వారినిగాని పంపకూడదు. మనము సంఘముద్వారా మన కష్టముల సక్రమాందోళనా మార్గమున నెరవేర్చుకొనవలెను. మిమ్ముల ఈశ్వరుడు సంరక్షించుగాక.

సభా వ్యవహారములందు ఎక్కువ శ్రద్ధ వహించినట్టియు సభను దైవ ప్రార్థనతో ప్రారంభించునట్టియు శ్రీ మన్నేపల్లి సుబ్బరాయుడుగారు అధ్యక్ష ఆహ్వాన సంఘాధ్యక్షుల ఉపన్యాసముల ధోరణిననుసరించి ఎక్కువకాలము ఉపన్యసించిరి.

---

## మహాసభయందు ఆమోదింపబడిన తీర్మానములు.

---

### 1-వ తీర్మానము.

ఈ ఎస్టేటునందు జాయింటు పట్టాల చిక్కుల చేతను పట్టాదారులే అనుభవము దారులు గానందువలనను, రయితులు పెక్కు కష్టములకు లోనగుచున్నారు. గనుక అట్టి చిక్కులను బాపుటకు, అనుభవము ప్రకారము పట్టాలను విడదీయుటలు, తక్షణం చర్యగైకొనవలయునని ఈ సభవారు ఎస్టేటు వారిని, ప్రార్థించుచున్నారు.

మఱియును, ఇకమీదట గవర్నమెంటు గ్రామాదులవలె విక్రయ రిజిష్టరు కాలమునందే పట్టా ట్రాన్స్ఫరులు విధిగా జరుగునట్లు చట్టమునందు సవరించవలయునని ఈ సభవారు శాసనసభవారిని దొరతనమువారిని ప్రార్థించుచున్నారు.

ఉ: మన్నేపల్లి సుబ్బరాయుడు.
ఆ: యిడమకంటి వెంకట్రామిరెడ్డి.

### 2-వ తీర్మానము.

ప్రస్తుతము ఈ ఎస్టేటులో అములులోనుండు కిస్తీకాలము, రయితులకు కేవలము ప్రతిబంధకముగా యుంటూ సర్వవిధముల కష్టపెట్టుచున్నది. గనుక సరిహద్దు సర్కారు గ్రామాదుల కిస్తీవాయిదాకాలమును నిర్ణయింప జేయించ వలయునని ఈ సభవారు శాసన సభ వారిని, దొరతనమువారిని, ఎస్టేటువారిని ప్రార్థించుచున్నారు.

ఉ: మన్నేపల్లి సుబ్బరాయుడు.
ఆ: గువ్వల రామచంద్రారెడ్డి.

### 3-వ తీర్మానము.

జమీందారులుగాని వారి యిలాకా వారుగాని శాసనసభలకైనను, లోకల్ బోర్డులకైనను, అభ్యర్థులుగా నిలువ రాదనియు, అట్లు నిలిచినను రయితు లెవ్వరును వారికి ఓట్లు ఇవ్వరాదనియు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

ఉ: సీలంరాజు పట్టాభిరామయ్య.
ఆ: అల్లం పిచ్చిరెడ్డి.

### 4-వ తీర్మానము.

వెంకటగిరి ఎస్టేటులోని కంచెల విషయమై వెంకటగిరి తాలూకా జమీందారీ రయితు సంఘమువారు 3—10—31 తేదీన మోపూరులో చేసిన తీర్మానమును ఈ సభవారు బలపరచుచున్నారు.

ఉ: పోగుల యల్లమంద.
ఆ: తూము చిననాగిరెడ్డి.

### 5-వ తీర్మానము.

ఎస్టేట్సు ల్యాండు అక్టు సవరణ 12/13 రు బిల్లు నందలి, చెట్లహక్కును సంబంధించిన విషయము రయితులకు ఉన్న హక్కులను సైతము భంగపరచునదిగా యున్నది. గాన ప్రత్యేకపట్టాలతో నిమిత్తం లేకుండా చెట్లహక్కు పూర్తిగా రయితే అనుభవించు లాగున శాసనమునందు సవరించవలయునని ఈ సభవారు గవర్నమెంటు వారిని ప్రార్థించుచున్నారు.

ఉ: యిడమకంటి వెంకట్రామిరెడ్డి.
ఆ: భొట్ల వెంకంభొట్లు.

### 6-వ తీర్మానము

దొరతనమువారిచే ప్రవేశపెట్టబడిన న 12/31 రు బిల్లు నందలి పెక్కు సూత్రములు రయితులకు చాలా అననుకూలముగా యుంటున్నవి.

(సశేషము.)

# తంజావూరులో బ్రాహ్మణేతర మహాసభ జమీందార్ల కుట్రచే భగ్నమగుట.

———:o:———

## జమీందార్ల పార్టీవారిని జస్టిసు పక్షనాయకుడుగా ఎన్నుకోదలచి నందున కక్ష లేర్పడుట.

———:o:———

జమీందార్ల కుట్రకు వ్యతిరేకులు సభచేసి రైతు పార్టీని బలపఱచుట.

———:o:———

చలసాని సత్యనారాయణ చౌదరిగారి యెస్టేట్సు ల్యాండు ఆక్టు సవరణ బిల్లును ఆమోదించుట.

———:o:———

బొబ్బిలిరాజా, వెంకటగిరి కుమారరాజా గార్లను సభలో మాట్లాడనివ్వకపోవుట.

———:o:———

## మునుస్వామి నాయుడు గారిని పార్టీ నాయకుడుగా ఎన్నుకొనుట.

———:o:———

తంజావూరమున మరల నేడు ఆంధ్రప్రతిష్ఠ మెరసిపోయినది. బ్రాహ్మణేతర మహాసభా సమావేశము శనివారమునాడు కావలసియుండెను. అచ్చట ఆంధ్రులగు మునుస్వామి నాయుడుగారికిని, బొబ్బిలి దేశస్థుడగు రాజాగారికిని జస్టిసుపక్ష నాయకత్వమునుగూర్చిన తీవ్రమగు సంఘర్షణ జరిగినది.

శుక్రవారము నాడుదయమునుండియు దేశదేశములనుండి జస్టిసుపక్ష మహాసభకు ప్రతినిధులు తెక్కుకు మిక్కిలిగ విచ్చేయుచుండిరి. ఆనాడుదయమే మునిస్వామినాయుడుగారు, కుమారస్వామిరెడ్డిగారు, రాజాగారు వెంకటగిరి కుమారరాజాగారు బొబ్బిలి రాజాగారుమున్నగు వివిధపక్ష నాయకులు తంజావూరునకు చేరుకొనిరి. అదినము మొదలు మరల రాయబారములు జరిగినవి. కాని రాజీకి యిరుపక్షములవారును ఒప్పుకొనలేదు. అరవ, తమిళదేశము లమీద నాయకపదవి ఆధారపడియున్నదని కొందరు నాయకు లభిప్రాయపడిరి. రాజాగారికి నాయకపదవి నొసగుటకు మునిస్వామి నాయుడుగారొప్పుకొనలేదు. బొబ్బిలి రాజాగారికి గాని మరే జమీందారుడుగాని ఆపదవి నొసగుటకు, రైతుప్రతినిధులు ఒప్పుకొనలేదు. ఇరుపక్షములవారికిని మనస్పర్థలు అంతకంతకెక్కువగుచునే యుండెను.

### తే 8 ది శనివారపు సభ

ఇట్లుండ శనివారమునాడు స్పెషలుబండిలో ఆంధ్రదేశమునుండి ప్రతినిధు లరుదెంచిరి. కుప్పుస్వామిచౌదరి గోపాలకృష్ణయ్యగార్లు మున్నగునాయకు లరుదెంచిరి.

జమీందార్ల పక్షమునకంటె నాయుడు పక్షమున ప్రతినిధు లెక్కువైరని తెలిసి కృష్ణా, గుంటూరు, బళ్ళారి, గోదావరి, మున్నగు ఆంధ్రమండలములవారి కప్పటికిం టిక్కెట్లివ్వకుండ చేసిపెట్టిరి. ప్రముఖులగు నాయకులను కుడకు మంత్రులనుగూడ టిక్కెట్లివ్వమని చెప్పిరి ఆహ్వాన సంఘాధ్యక్షులు, వారి కందరికి టిక్కెట్లిచ్చే నేను సభకురానని బొబ్బిలి రాజాగారనుచున్నారని తమ అశక్తతను తెల్పిరి. కడపట రెడ్డినాయుడు అన్నామలై చెట్టిగార్లు మున్నగు నాయకులు టిక్కెట్లిమ్మటకు ఆహ్వానసంఘమువారికాజ్ఞాపించిరి. డెలిగేట్లు టిక్కెట్ల కొఱకు వెళ్లుసరికి అప్పటి వెవ్వరును లేరు.

### మహాసభ తీవ్రపరిస్థితి.

సభ మూడు గంటలకు జరుగవలసియుండెను. 3 గంటల వరకుగూడ నాయకులు రాజీప్రయత్నములు చేసిరి. కాని, ఆహ్వానసంఘమువార్లను లగుపడలేదు. మహాసభ రావుబహదూరు రామనాథ చెట్టిగారిహాలులో జరుగవలసియుండెను. ఆహాలుకద్ద రెండుగంటలనుండియు మహాసభా ప్రతినిధులు గుమిగూడియుండిరి. మూడుగంటలగుసరికి ప్రతినిధులు గేటుముందట "మోసము మోసము" అని కేకలు వేయుంట కారంభించిరి. ఇంతలో జమీందార్ల పక్షమువారి కందరికి టిక్కెట్లు పంచిపెట్టబడినవని వార్త అచ్చటి కూడిన సమూహముసంతటను దావానలమువలె వ్యాపించెను. ఇంక డెలిగేట్లు ఓపిక పట్టలేకపోయిరి. వెంటనే గోడలమీద నెక్కి కొందరును తలుపులనెక్కి కొందరును హాలులోనికి దుముక నారంభించిరి. కొందరు తలుపులను బలవంతముగ పట్టి విరిచివైచి ద్వారమును బాహాటముగ తెరచివైచిరి. వెంటనే హాలంతయు క్రిక్కిరిసిపోయెను. ఇసుకవైచిన రాలనంతటి జనము ప్రోగైనది. అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య గారును ఇంక కొందరు పెద్దలు ఓ పి క తో నుం డ వ ల యుననియు ఎట్టిపరిస్థితులందైనను శాంతమును విడనాడవలదనియును విన్నవించిరి. వెంటనే సమావేశమంతయు నిశ్శబ్దముగనుండెను. ఎంతవరకుచూచినను మహాసభాహ్వానసంఘమువారి గాని, బొబ్బిలిపార్టీవారుగాని రాకుండుటచేత శ్రీయుత మహబూబ్ అలీబేగ్ యం. యల్. సి గారు త్రిపురనేని రామస్వామి చౌదరిగారిని మహాసభ కధ్యక్షులుగ నుండవలసినదిగ ఉపపాదించిరి.

చిర. టి. యల్. రామకృష్ణారెడ్డి యం. యల్. ఏ. గారు వుపపాదనను బలపరచిరి. ఉపపాదన మేకగ్రీవముగ నంగీకరించబడినది. సభలో అన్ని మండలములనుండి వచ్చిన ప్రతినిధులు మూడువేలకు మించియుండిరి.

(దీని కొరవ 6-వ పేజీలో చూడుము.)

# ఏజంట్లు కావలెను.

ఆంధ్రజమీందారీ లన్నిటిలోను మా జమీందారీ రయితు ప్రతికకు చందాదారులను చేర్చుటకు ఏజెంట్లు కావలెను. ఉత్తర ప్రత్యుత్తరములు నాతో జరుపవలెను.

మేనేజరు.
"జమీందారీ రయితు"
నెల్లూరు




## తంజావూరు సభాభగ్నత.

తంజనగర బ్రాహ్మణేతర సభలోని అల్లరులకు కారకులెవరు?

అనునది ముఖ్యప్రశ్న. ఈ కుట్ర నేటిదిగాదు; మంత్రుల నియామకము మొదలు జమీందారీ పార్టీలో రాజుచుండినది. ఈ పార్టీకి నాయకులు బొబ్బిలి వారును వెంకటగిరివారును. మంత్రుల నియామకములో తమకొక సీటు గూడ లేకపోవుటచే యీ కుమ్ములాట బైలుదేరినది. అది మొదలు లోపల కుమ్ములు చుండినవి. మెయిలు పత్రిక నీలగిరి విలేఖరి యీ కుమ్ములాటలే బైటపెట్టెను. యింతలో యెస్టేట్సుల్యాండు యాక్టు సవరణ సందర్భమున ప్రధానామాత్యుడు రయితుపక్షమున జమీందార్లకు ప్రత్యేకమున అడ్డు తగులుటచే ఈ లోపల కుమ్ములుచుండిన అగ్ని పైకి ప్రజ్వరిల్లజొచ్చెను. ఇటీవల మద్రాసులో జరిగిన జస్టిసుపక్ష సమావేశమున ప్రధానమంత్రిగారి పై విశ్వాస రాహిత్య తీర్మానము తెచ్చుటకు ప్రయత్నించిరి. తమపలుకుబడి చాలకపోవుటచే అదియు సాగలేదు. అదిమొదలు తంజావూరుసభ వైరుధ్యముల కేంద్రీకరించిరి. జమీందారులు తీవ్రప్రయత్నముల జేసిరి. వెంకటగిరినుండియు, కృష్ణగోదావరి జిల్లాలనుండియు బహుళ సంఖ్యాకులను ప్రతినిధుల రప్పించిరి. అమాత్యులలో నొకరు వీరికి బాసటైరి. సభా నిర్వాహకులలో కొందరు వీరికి తోడ్పడిరి.

నాయుడుగారి పక్షసభ్యులకు టిక్కెట్లు నివ్వకుండ జేసిరి. పెద్దలు కొందరు టిక్కెట్లు నివ్వవలసినదిగ మధ్యవర్తిత్వము జేసినను సమయమునకు టిక్కెట్లు నిచ్చువారు అగపడకపోయిరి. జమీందారీ పార్టీవారికి తప్ప టిక్కెట్లు లభించలేదు. వీరికుట్రలు చూచుచుండిన ప్రతినిధులు టిక్కెట్లు లేకుండినను లోన ప్రవేశించి స్థానముల నాక్రమించుకొనిరి. యిందులో ఎవరిది తప్పో పాఠకులే యూహించగలరు. రెండవ పక్షమువారి తప్పు యెంతవరకన, టిక్కెట్లు నివ్వకపోయిన మరుబాడికి యిండ్లకు చేరక జమీందార్ల కుట్ర భగ్నపరచిరను నదియే అపవాదము. పోకిరితనము చేసినవారిని మేముసమర్థించుటలేదు. కాని తక్కినవారు సభలో ప్రవేశించుటకు మార్గాంతరమేమిటనా యను ప్రశ్నకు సమాధానమేమి? సభలో వెంకటగిరి కుమారరాజాగారినిగాని, బొబ్బిలి రాజాగారినిగాని మాట్లాడనివ్వలేదు. బొబ్బిలిరాజాగారి మెడలోని పూలదండల నైతముపెరికివేసిరట. జమీందార్లను రక్షణతో బైటకు సాగనంపవలసివచ్చినది. వీరు-లోన ప్రవేశించునప్పుడైనను దొడ్డిదారి నుండనే దూరివచ్చిరి. సభలో అల్లరి విపరీతముగ జరుగుట అవమాన హేతువు. చెప్పులు విసరుటయు, మట్టితో గొట్టుటయు బెంచీలు కుర్చీలు విరుగగొట్టిరటయు, యిదంతయు అసమంజసము. ఈ పోకిరిపనులు జేసినవారు యిరుపక్షములను కలరు. కాని మొదల జమీందారుల పార్టీవారు చెప్పులు విసరిరట! రెండవ పక్షమువారు మట్టితోగొట్టిరట. ఈ పోకిరితనమును జేసిన వారిని నాయకులు మందలించుట అవసరము.

ప్రథమ దినము జరుగవలసిన సభ రెండవరోజుకు వాయిదాపడుటతో సభావరణమునగల ప్రతినిధులు (శ్రీ) త్రిపురనేని రామస్వామి చౌదరిగారి అధ్యక్షతక్రింద సమావేశమై కొన్ని ముఖ్య తీర్మానముల జేసిరి. అందు చలసాని సత్యనారాయణ చౌదరిగారి యెస్టేట్సుల్యాండు బిల్లు నామోదించుట యొకటి. దీనినిబట్టి జ॥ రయితుల కష్టముల నేడు దేశము కన్నెత్తి చూచుచున్నదని తలపవచ్చును.

తంజావూరిసభ కరిగిన వారిలో వెంకటగిరి ప్రతినిధులు 22 మందికలరట.

ఈప్రతినిధులలో ఒకరిద్దరుతప్ప తక్కినవారు జమీందారుగారి నౌకరులు. యిందులో వెంకటగిరి సభలలో అల్లరిచేయించిననాయకులు గూడకలరని వినుచున్నాము. యిందునుబట్టి ఎవరుఅల్లరిని ప్రేరేపించుయత్నములోనున్నది. ఊహించవచ్చును.

జమీందారులు సభలలో అల్లరులుజరిపించుట నేడుప్రారంభమయినదికాదు. వెనుక విశ్వనాథదాసు మహాశయోగారు పర్లాకిమిడిలో జమీందారీరయితు ఉద్యమమునుగూర్చి ఉపన్యసించు సందర్భమున జమీందారులనౌకరులు అల్లరుల ప్రారంభించగా దాసుగారు ప్రాణములతో వెలిబడవలసి వచ్చినది. గతసంవత్సరము వెంకటగిరియందు జరిగిన ఆంధ్రజమీందారీ రయితు మహాసభ, జిల్లాజమీందారీరయితు మహాసభలను జరుపకుండ 144 సెక్షన్ నిచ్చిని

# లోకల్‌బోర్డు ఎన్నికలు.

—:o:—

నెల్లూరుజిల్లా బోర్డులకు

—:o:—

## నామినేషను 21 అక్టోబరు.

## ఎలెక్షను 12 డిసెంబరు.

—:o:—

షేధించిన సందర్భమున అరవమాలల కొందర (జమీందారుసౌకర్ల కొందరు కర్రలతో వీధులలో ప్రత్యక్షము చేయుచుటయు అనుమతో సభలకు నిషేధాజ్ఞ యిచ్చుటయు జరిగినది. వెంకటగిరిలో శా శేశ్వరరావు పంతులుగారు రెండురోజులు ఉపన్యసింపగా జమీందారుగారి ఉద్యోగులు ప్రథమ దినముగల్భాచేసి సభలో పంతులుగారిని అతినీచముగా దుర్భాష లాడుటయు, మరుదినము ఆవరణములో ఉపన్యసించినను గూడ బలవంతము లోనదూరి కొందరినికొట్టి గల్భాచేసిసభను జరుగకుండ చేయుటయు జరిగినది. యిట్లే యెన్నియో సాదృశ్యములు గలవు.

కాని అన్ని ప ర్యా య ము లు ను జమీందారులు తమ ఆటలే సాగునని యెంచుట పొరబాటు. ఇక రాగల కాలమున బలవంతులు బలహీనుల నణగద్రొక్కజాలరు. జమీందారులు వెనుక నెన్నియో అక్రమముల చేసిరి. కాని యికనైన తమ వెనుకటి కథలను మరచి ప్రజాశయములకు విరుద్ధముగ నడునక కాలప్రవాహమున తలయొగ్గి సంచరించుట ధర్మము. జస్టిసుపక్షమున ఉదారాశయములు గలవారికి సైతము అవకాశములగల్పించి దీనిని రాజకీయపక్షముగా జేయుట అవసరము నేను జమీందారుల పక్షమని దీనికిని, ఈ పక్షపత్రికలకును అపవాదముకద్దు. అట్టి అపవాదమును బ్రాహ్మణేతరనాయకులు తీసివేయుట ఉచితము.

---

(మూడవపేజీతరువా)

### తీర్మానములు

"ఈమహాసభవారు జస్టిసు పక్షనాయకులగు శ్రీమునిసామినాయుడుగారియందు సంపూర్ణ విశ్వాసమును ప్రకటించుచు శ్రీనాయుడుగారి నే మ నాయకులుగ నెన్నుకొనుచున్నారు"

"జస్టిసుపక్షమందు బ్రాహ్మణులను గూడ చేర్చుకొనుటకు ఈమహాసభవారు తీర్మానించుచున్నారు"

"కంట్రిబ్యూటరీలేని మొత్తె రాజకీయసంస్కరణలుగాని దేశమునకు అంగీకారములు గావనియు పూర్ణా బడుంబడికి ఆమోదించినను, సత్యనారాయణరావుగారి ఎక్కడు లాఠీదు పరిరక్షణము నామోదించిను, తీర్మానము లామోదింపబడెను. మరు మహా స భ గు ం టూ రు లో జ రు పు ట కు గా ద అ ం గీ క రి ం ప బ డె ను. ఈ స మ య ము న ప్రతినిధులు కొందరు పోలీసువారిని తీసుకొనివచ్చి లాంఛము కలవరము గలిగించిరి. కాని పోలీసువారు మాత్రము ఎట్టిజోక్యమును కలుగ జేసికొనలేదు అన్నమలైచెట్టి మునిస్వామి నాయుడుగారలు సభకువచ్చి మాటాడబోగా అధ్యక్షులనుమతి వొసంగలేదు. పిమ్మట అధ్యక్షులకు రామసామి చౌదరిగారిని ఊరేగింపుతో బసకు గొంపోయిరి తంజావూరి స్థానికులుగూడ వారిని హారములతోడను హారతులతోడను వారిని గౌరవించిరి.

### ప్రచండకల్లోలము

ఇంతలో మహాసభను మరునాడు జరుపవలయునని ప్రతిబలప్రయత్నములు జరిగినవి. ఆదివారమునాడు ఆరుగంటలకే సభకిక్కిరిసిపోయెను. నారాయణస్వామి నాయుడుగారు జమీన్‌రైతుపాటలనాలాపించిరి. ఇంతలో మునిస్వామినాయుడుగారు రాగా "మునిస్వామినాయుడుగారికి జై" యనుకేకలును "రైతుబిడ్డకు జై" యను జయధ్వానములును ఉత్సాహాతిరేకమున చెలరేగిన కరతాళధ్వనులును మిన్నుముట్టినవి. వెంటనే బొబ్బిలి రాజాగారు మున్నగువారు పోలీసువారి సహాయముతో వెనుకద్వారమున సభాభవనము ప్రవేశించిరి. బొబ్బిలిరాజాగారు వచ్చుచున్నాగన గానే "గోబాక్ బొబ్బిలి," "బొబ్బిలి వెనుకకు పొలండి" జమీన్‌దారుతేవద్దు "అనుకేకములు ప్రతిధ్వనించెను. మునిస్వామినాయుడుగారు సమాధాన పరచ ప్రయత్నించగా వారిని మాట్లాడవలదని అడ్డుపెట్టిరి. వెంకటగిరి కుమారరాజాగారు మాట్లాడజూచిరి. కాని "జమీందార్ల మాటలు మాకొద్దు" అని అరచిరి. ఆహ్వానసంఘాధ్యక్షులు ఉపన్యాసమివ్వ బ్రయత్నించగా సభ కిక్కిరిసెనజరిగినది గాన వారి ఉపన్యాసము మాకొద్దు "అనికేకలువైచిరి. బొబ్బిలిరాజాగారు కుర్చీనుండి లేచిరిలేవగానే గోబాక్, కేకలతో ఒక్కుమ్మడిగ స మా హా మ ం త యు లే చె ను. చెప్పులు, రాళ్ళును, విస్తళ్లువిడిగ విసరవేయబడెను. కుర్చీలు బల్లలు పగులగొట్టబడెను. సభగందరగోళము మధ్య ముగిసెను.

బొబ్బిలి రాజాగారిని తుదకు అదుసుమల్లి గోపాలకృష్ణయ్యగారును, మరికొందరు ఆంధ్రప్రతినిధులును రక్షణ మొసగి హాలుబయటకు తీసికొనివచ్చిరి.

---

### తంజావూరు సభకు

జమీందారు పక్షము గెలిపించుటకు

పోయిన వెంకటగిరి రయితులు.

1. పొట్లపల్లి గురప్పనాయుడుగారు కన్వీనర్లు పోలవరము.
2. నిడిగల్లు టీ.సుబ్బరెడ్డిగారు.
3. కొత్తగుంట గురునాథయ్యగారు.
4. నాటికోడు వెంకటస్వామిరెడ్డిగారు.
5. వెంకటగిరి గ్రామమునసబు వెంగలురెడ్డి గారు.

వీరలు మాత్రము వెళ్ళినట్లు తెలియుచున్నది. వీరు నను కుమారరాజాగారితో తమయొక్కర్లు చెప్పుకొనుటకు అవ్వుటనైనా అవకాశముండునేమో నని వెళ్ళినట్లు వదంతిగా నున్నది. ఏమైనాగాని యిట్లు రాళ్ళ 40 మంది వరకు తంజావూరు సభకు ప్రతినిధులుగా వెళ్ళినట్లు తెలియుచున్నది.

(స్వకీయ విలేఖరి.)

నెల్లూరి కథలు.

# రంగడు రాయైనవిధము.

—(౦)—

(భవిణ)

నెల్లూరిని 12 వ శతాబ్దారంభాన కృష్ణమనాయడనే ప్రభువు పాలిస్తుండేవాడు. అతడుదైవభక్తుడు. న్యాయమూర్తి ప్రజలపైన అనురాగముతో వుండేవాడు.

ఆదినములలో నెల్లూరిప్పటిలాగ లేదు. అంతాఅడివి పెన్నయిప్పటిలాగనే వర్షాకాలాన బడివదలిన కుర్రాడిలాగ పిల్లలు దడవుకొంటూ పరుగెత్తుండేది. ఎండల కాలంలో సన్నగిలి పోయుండేది. యేటి గట్టునమాత్రం కొన్నికుటీరాలుండేవి. అదే నెల్లూరు. కృష్ణమనాయనికి యేటికద్దరిని యిద్దరినీగూడ గ్రామాలుండేవి. తనయేలుబడిలోని గ్రామాలన్నీ స్వయంగా చూచుకొంటూ మాసానికొకమాటు నెల్లూరుజేరి నాలుగు నాళ్ళుండి మరలపోతుండేవాడు నాయుడు.

విష్ణుభక్తుడైనందున నెల్లూరిలో నది ఒడ్డున దేవళమొకటి కట్టించినాడు. అందు ఆ శిలను ప్రతిష్టించి రంగనాయకులని పేరు పెట్టి, యిష్టదేవతను గావించుకొన్నాడు. కృష్ణమనాయని కాలమునకు మూడుతరములముందు ఆకుటుంబములో రంగపనాయనివారని ఒకమహామహుండేవాడట. అతడు ప్రభువుగాకుండినా, రాజ్యతంత్రమెఱిగి మేధావియై, అన్నయైన అంకపనాయునకు సలహాయిస్తుండేవాడట. సర్వజ్ఞుడైన ఈరంగరాయుడు చిన్నవయస్సునందే విప్లవకారుల వలన ప్రాణాలు గోల్పోయినాడట. ఆతనిపైని గౌరవాన యిట్లు ఆ పేరుతో దేవతను ప్రతిష్టించుకొన్నాడని కొందరనేవారు. మఱికొందరు, రహీం సాహెబనే ఓడవర్తకుడు ధనముతో సముద్రతీరానికి ప్రయాణంచేస్తుంటే అంకపనాయుడాతని సరకులను దోపిడిచేయించి ఆ సాహెబును జంపినందున కృష్ణమనాయడా హత్యాపాతకాన్ని తప్పించుకోడానికి దేవాలయం గట్టించి రహీంకు బదులురంగడన్నాడనిచెప్పుచుండేవాళ్ళు. ఎట్లయితేనేమి. ప్రతిష్టింపబడ్డ రంగనాయకుల రక్తనాళాల్లో ప్రవహించేది వెలమనెత్తురయినా తురకనెత్తురయినా అతడుమాత్రం దేవుడైనాడు.

ఆదినములలో రంగడిప్పటిలాగ అందరుదేవుళ్ళలాంటి మూగమొద్దుదేవుడుగాడు. రాత్రివేళల్లో గ్రామమంతాదిరుగుచు కాపాడేవాడట. రాత్రివేళసంచరించే దొంగలు అభిసారికలు వుదయమయ్యేసరికి గుండెలుబగిలి యేచెట్లక్రిందనో పాడుగుంటల్లోనో బడివుండేవారట. పసులకాపర్లకప్పుడప్పుడగపడేవాడట గాని వారికేమి అపకారంచేయడట. చంటిపిల్లలు అర్ధరాత్రిమప్పుడు పోరువెత్తితేతల్లులు 'రంగతాతవస్తున్నాడం'టే గబుచిప్పని నిద్రబొయ్యేవారట. వేసవికాలాన బయటబడుకొన్నవారు పుష్పచందనాల పరిమళాన్ని గనిపెట్టి ఆయనపహారాదిరుగుతున్నాడని కళ్ళుమూసికొనేవారట. ప్రతిదినము కృష్ణమనాయునికి కలలోగనుపడి పరిపాలనావిధానముపదేశించి అంతర్ధానమౌతుండేవాడు. జరుగబోవుసంగతులు వానిఅనుగ్రహాన కృష్ణమనాయునికి తెలుస్తుండేవి. తనకినుపగుగ్గిళ్ళుగనున్న విషయాలన్నిటిల్లో రాజు, రంగనిసలహాకోరుతుండేవాడు. అతని యిష్టానుసారంగా ప్రవర్తిస్తుండేవాడు. తుదకు యావత్తువ్యవహారసంబంధమైన తాళపత్రాలను రంగడి గర్భగుడిలోబెట్టి వెలుపలికివస్తే తెల్లవారేసరికి వాటిపయిన వుత్తర్వులువ్రాసియుండేవట. కృష్ణమనాయడు వానిపై గౌరవాన మరికొన్నిమాన్యములిచ్చి వాహనములుగూడ జేయించినాడు.

నెల్లూరిలోనే యీప్రభువంశము వారిచేనేర్పరుపబడ్డ ధర్మశాలఒకటుండేది. దీనికికొద్దిపాటి మాన్యాలువుండేవి. ఈ మాన్యలలో వచ్చేవరుమానముతో ప్రభువుల విరాళములుగలిపి బీదలకన్నదానము లేదనకుండ జరుపుతుండేవారు ధర్మశాధికార్లు. బ్రాహ్మణ బ్రహ్మచార్లు కడుపునిండాదిని చెఱువుల్లోకప్పల్లాగ వేదగోష్టి సలుపుచుండేవారు. భక్తులొకవంక వుదయాననే నామములుదిద్ది భజనరుమాళ్ళవారు.

భక్తిపారవశ్యానమై . మఱచివారు బాడేపాటలువిని జన్మాలు పునీతం జేసుకోవడానికి గ్రామస్థులే గాక పొరుగూళ్ళవారు గూడ చద్దికూళ్ళమూటలతో తయారౌతుండేవారు. కొన్నాళ్ళయ్యేసరికి, భజంత్రీలు నిలువు బొట్టువారైనా, శ్రోతలలో అడ్డబొట్టువారు, చుక్కబొట్టువారు, బొట్టులేనివారు, పెట్టరానివారు గూడ కలువసాగినారు. క్రమేణా వారూ భజనపరులైనారు. నెల్లూరిలో బొట్టుభేదమేగాక జాతిభేదంగూడ భక్తిసముద్రాన సమ్మార్జితమయ్యేటట్టుండింది. రాజు ఆనందభరితుడైనాడు. దాన ప్రియుడు గనుక విరాళములు హెచ్చింప నుద్యమించినాడు. వానికీర్తి లతలు మంచు పొగల్లాగ మిన్నుముట్టసాగినాయి.

రంగడప్పుడప్పుడు ధర్మశాలకు ఆళ్వారులతో విచ్చేసేవాడు. తాను ప్రేమించిన వారికి మాత్రం దర్శనమిచ్చి అంతర్ధానమౌతుండే వాడు. అంతటి భాగ్యానికి నోచుకోని యితరభక్తులు ఆశలు చిక్కబట్టి పిచ్చి చిందులు త్రొక్కుతు మఱింత భజన చేస్తుండే వారు.

రంగడికే కారణానో యీభక్తి వ్యాపకమంత నచ్చలేదు. అప్పుడప్పుడు ముఖం చిట్లించేవాడు రాజుగారెంత ప్రార్థించినా ధర్మశాల విషయమై సలహామాత్రం

మిన్నదిమే మూసినాడు. ఆళ్వారులు కొందరు స్వప్నాన రాజుకు దర్శనమిచ్చి ధర్మశాలనుద్ధరింప వలెనని, భక్తి పాతాన్ని లోకాన చాటవలెనని పురికొల్పుతుండే వారు. కృష్ణమనాయుడంతులకు కృతజ్ఞుడై యుండినాడు.

ఒకనాడు రాజు ధర్మశాల కొరకు జాగ్రత్తముగా వ్రాసి రంగని అనుజ్ఞకేసుకుని గర్భగుడిలో పెట్టినాడు. మఱునాడు చూడగా, దానిపైన పూచిన గుఱుతే లేదు. పొరబాటనుకొని మఱలవ్రాసి పెట్టినాడు. ఉదయమున పోయిచూడగా దానిపైన పెద్ద అడ్డుగీటుగీచి యుండినది.

రాజువిస్మితుడయినాడు. స్నానానంతరము తానే ధర్మాసనాను చేరబుచ్చుకొని రంగనిసన్నిధికిపోయినాడు. త్రికరణశుద్ధితో గూర్చుండి "నాకుసలహా యివ్వనిదే యిక్కడినుండిపోను" న్నాడు. రాత్రి మూడుజాముల పొద్దయినపిదప రంగడూడిపడ్డాడు. "ఓయి కృష్ణమరాజా! నీధర్మశాలనిర్మూలముగావలెనోయి" లేనిమొదల మతభేదములునశించి హీనయోని సంజాతులకు విద్యాగర్వము, భక్త్యానందము హెచ్చిపోతుంది. ఈ ధర్మాసనాను తెగులవేసి ధర్మశాలలోని నిలువుబొట్టులేని క్షుద్రజాతులకందరికి సంఘాతే మరణము విధింపవోయి. పూర్ణాహుతి కేయించవోయి. చిత్రవధగావింపవోయి." అని గంభీరంగా పలికినాడు. రాజుకీమాటలు ఇనుపములుకుల్లాగ నాటినవి. "భక్తికేబొట్టుయిన నేమయ్యా! సర్వవేత్తవు. నిరపరాధుల, పిల్లామిక్కిలి భక్తపరాయణుల ప్రాణాలునిలువున దీయుమంటున్నావే! యేమియీ పక్షపాతబుద్ధి? నీఆళ్వారులేనాతో" అనుచుండేసరికే తనమాటకడ్డపలుకువినుట కలవాటులేనిరంగడు నరసింహాకృతి దాల్చినాడు. "ఓహో! నిలువు నిలువున న్యాసము గుణపాఠాలు నేర్పిస్తున్నావే! నీకుచనవిచ్చినది నాదేపొరబాటు. నీపాటుయికజూచుకో! నీగతి" అని గట్టిగ తగవు ప్రారంభించాడు. కృష్ణమనాయునికీ పొగరు మాటలు వినేటప్పటికి నెలనురక్తము వడిగా ప్రవహింప జొచ్చింది. గుండె కటకటలాడసాగింది. నోటమాటరాలేదు. గాని కంపెత్తినైనది. చేయి, నడుమునచెక్కియుండే బాకుకొటు క్షప్రయత్నంగా లేడువులాడ జొచ్చింది. రంగడీసడి కనుకొన్నాడు. గర్భగృహాన రక్తపాతమౌతుందని విగ్రహములో దూరుకొన్నాడు. ప్రభువు కోపములోనే చిఱునవ్వునవ్వాడు. "నీవట్టి సలహాలు మేముకోకుంటము. అర్తిలో నుండి వెలుపలికిరావద్దు ప్రాణాలతో ఆశవుంటే. వివేకశూన్యుడా! పిరికిదేవుడా! పెద్ద అంబేద్కారుడా" అన్నాడు. ఈ యుదంతమంతా యేభాండలనూడో కనిపెట్టుతుండిన ఆళ్వారులందరు ఒక్కపెట్టున "తథాస్తు" అన్నారు. రాజుచిరునవ్వుతోనే బయటబోయి ఆనాటినుండి రంగడి ముఖమేజూడలేదు. తానే రాజ్యభారం వహించి చక్కగా పరిపాలింపసాగినాడు. ధర్మశాల చక్కగా వర్ధిల్లింది. రంగడు మాత్రం రాయైపోయాడు.

---

# వర్షయోగము.

---

## చిత్తకార్తె.

---

తే10-10-1932ది. ఆదివారం చిత్తకార్తె వచ్చుచున్నది. 23తేది యందు వెళ్ళి పోవుచున్నది. ఈకాలములో వర్ష ప్రతిబంధకాలముగ పురోబుధ యోగము. "పురోంగారపనావృష్టిః, పురశ్శుక్రో ప్రతిక్షతి, పురోబుధశ్చ వాయుశ్చ" అను ప్రకారము సూర్యునికన్న ముందు నడచు బుధునివలన, వర్షప్రతిబంధకమగు గాలియుండును. ఇట్లుండినను భాద్రపద పూర్ణిమకు వెనుక వర్షలక్షణధర్మము ననుసరించి కొన్ని వర్షయోగములు ఫలవంతములగును. ఆకారణమున చిత్తకార్తెలో, గు-శు-శనులు జల.(అమృత జల) సౌమ్య నాడులందు చరించుచున్నవారలు. కుజుండు పీయూషనాడిలో నున్నవాడు. కనుక నీకాలములో వర్షము లభించునని నమ్మతగియున్నది. ఇందులో తే10-11దులందు చంద్రుండును పీయూషనాడి, కాన చంద్రకుజులు పీయూషనాడీ సంచారకాలమిదియగును. "ఏకనాడీ సమారూఢౌ చంద్రమాధరణీసుతౌ యదితత్ర భవేజ్జీవః తదావారిమయం జగత్" గురువు పీయూష నాడియందు లేడు. లేకున్నను, కుజ చంద్రసంచారములో గురువు జలనాడీగమునక వర్షమున్నది.

తే12-13దు లందు, చంద్రుండు జలసౌమ్య నాడులందు చరించును. అచట జలనాడిలో గురువున్నవాడు. కనుక 10మొదలు 14తేదీలలో ప్రగ 5 దినములలో వర్షముకురియవలసియున్నది. ఈకాలములో చంద్రుండు జలరాసులను మకరాదిత్రియములో చరించును. 10-11తేదులందు. చంద్ర జలమిత్రముల శుక్రసంచారమున్నది. కనుకవర్షము రాగలదని తెలపెదను. "జలరాశి గతేచంద్రే జామిత్రే నవపంచమే, అర్కానుః భృగు శ్చైవతుర్యాదేకాద్గతంజగత్" హస్తలో అకుఅల్లాడిన (గాలికలిగితే) చిత్తలో చినుకుపడదని ప్రతీతియేకాక, వర్షనిరీక్షణయందును ఈ వచనమున్నది. ప్రకృతము హస్తలో పడమర గాలి తొత్తుగనిలిచియున్నది. దీనిచే గూడవర్షము వచ్చునని తలపవచ్చును. దీపావళికి మంచివర్షయోగ మున్నది.

మొదలి రామకృష్ణ సిద్ధాంతి.
హారోరావిలాస్

నెల్లూరు.
7- 10- 1932.

---

## పిడుగుచే మనిషి మరణించుట.

---

వెంకటగిరికి 10 మైళ్ళలో కొత్త పల్లవద్ద అక్టోబరు తే 8 ది పిడుగుబడి ఒక మనిషి మరణించినట్లును మరియొకరు జబ్బు స్థితిలో నున్నారని యిం తెలియుచున్నది.

---

